కమనీయతపనీయ కౌశీయములుబూను
నరవరేణ్యుడు తాల్చె నారచీర,

మహనీయ కరణీయ మహితశయ్యను పండు
రాజునేడు పరుండె రాతినేల.

ధర్మ నిర్మితహర్మ్యభాగంబుల వసించు
ప్రభువు నేడు వసించు పర్ణశాల.

చతురబ్ధివేష్టితక్షితివతం సమునేలు
నృపతి యీనాడేలు నిపినసీమ.

కటకటా యెట్టి విద్రోహ కఠినకార్య
మునకు పాల్పడె కైకేయి, మూర్ఖురాలు,
గొంతుతెగగోసె నొక తడిగుడ్డతోడ
దుష్టులకుగాదె దైవంబుతోడుపడుట.

కరుణాసింధుడు, సత్యసంధుడు, మహాకల్యాణ కౌముండు, సా
గర గంభీరుడు, నేడు కాయగసురల్ కాంక్షించి భక్షించుచున్
నిరుపేదంబలె చెట్టుగుట్టలకడన్ జీవించుచున్పల్లె లో
దర నీరమ్ములుగ్రోలు, కాలమహిమన్ తప్పింపగా శక్యమే ?

భరతా! కోరికతీరెనా ? విమలమై స్వాంతమ్ము శాంతించెనా?
చిరకాలార్జిత రాజ్యకాంక్షతిరమై సిద్ధించెనా ? హృద్వ్యధా
భర దుశ్చింతన కూటనీతిఫలముల్ పండించెనా ? కోసలో
ర్వరయుష్మద్భుజ పీఠిపై నిలిచె నిద్రంబొమ్ము భద్రమ్ముగన్.

భరతుని రాజ్యకాంక్షయను పాపము, శాపముగా వయోధ్యకే
ఉరియయి, లోకవంద్యునకు నుత్కటకాననవాసమై, కటా!
గురునకు కానసర్పమయి, కూరిమితల్లులకున్ వికార దు
ర్భరవిధవాత్వమై యెడద ప్రజ్వలియింపగజేసె నాకాగిన్.

కనులన్ గంగ, తలంపులన్ యమున, వాక్యప్రక్రియన్ తుంగ, మె
త్తని గానంబున పెన్న : ప్రేమరతి గోదా ; జీవిత ప్రాంగణ
మ్మున కృష్ణానది, డెందమం దుదధిగా, పుంజీకృత ప్రాప్త ది
వ్య నదీకూటమియయ్యె పౌరజనతా వ్యాపారసంచారముల్.

ఎవ్వరినేమియన్నఫలమేమి? మొగమ్మునవ్రాసియున్న మా
కివ్విధితప్పునెట్లు? విధికించుక మంచితనంబెయున్న క్రాం
బువ్వము బోలునన్ననడపుల్ తిరుగాడుమటంచువ్రాయునే?
అవ్విధివ్రాతలన్ జెఱుపనయ్యెడువాడుజగాన కల్గునే?

చిన్నతనంబునం దొడినిజేరిచి కూకటి దువ్వి ముంగిటన్
పెన్నిధివోలెనగ్రజునిపెంచిన ఆ జనయిత్రి, అక్కటా!
క్రన్ననలోకనింద కొడిగట్టినదేటికొ? దైవకార్యమే
మున్నదొ దీనివెన్క? తుదకూరట యీకథకెట్టులుండునో?

భరతుడు మచ్చలేనిప్రభుభక్తుడు; స్వార్థమెఱుంగబోని స
చ్చరితుడు; సింహపీఠిపయి స్వామిరఘూత్తము పాదరక్షలన్
తిరముగనుంచి, మౌనియయి, దేహసుఖంబులనుజ్జగించి, తా
నిరతము రామరాజ్యమును నిల్పుటకే భరియించెప్రాణముల్.

క్రమమొక్కించుకలేక చేకురిన సామ్రాజ్యంబువర్జించి, అ
గ్రజముగా మానవతానురాగములకున్ పందిళ్ళకప్పించి, స్వా
ర్థమునుం జంపి సమాధిగట్టి; ప్రజకాదర్శప్రబోధమ్ముగా
తమివర్తించిన అన్నమాభరతుడేతన్మాత్రుడేధాత్రిలోన్.

వరలినదోయితిగ్మకరవంశయశోరమ కొప్పులోని క్రొ
వ్విరుల పరీమళంబు; పురివిప్పినదోయి సమస్తభూప్రజా
దరణఝరీమయూరి, తలదాల్చినదోయి జగంబునీవ యే
ర్పరచినత్యాగమార్గము; భవన్మృదుజన్మము ధన్యమాయెరా!